Registered No. M-4345.

# యుద్ధ సంచిక

వాల్యూం II.] మద్రాసు : 1942 వ సం॥ ఫిబ్రవరి నెల 27 వ తేది శుక్రవారం [నెం 8.

## యుద్ధ విమర్శ.

## అన్ని యుద్ధరంగాలు కలిపి చూడాలి.

### సింగపూరు పోతేఏం ? యుద్ధం ముగియుటమరింత ఆలస్యమగును, అంతేగా !

ఈ రోజులలో సింగపూరు విలాపం అందరికి పరిపాటైపోయింది. పడిపోయిన ఆ కోట నుండి గుంపులుగా జనం ఇండియాకు వస్తున్నందున ఇండియాలో యీ జబ్బు మరీ ఎక్కువగ నుంది. విచారించే వారంతా చర్చిలుగారి ఉపన్యాసం చదవాలి వారు యిటీవల గావించిన ఉపన్యాసంలో మామూలు ధోరణిలోనే, విషయం దాచకుండా స్పష్టంగా చెప్పిరి. అట్లా చెప్పగల్గి యుండడం ఒక గొప్ప లక్షణమే. అంతకన్న ప్రధాన మంత్రిగారిలో ఉన్న విశేషం యేమంటే, మంచివార్త కాని చెడ్డవార్త గాని చెప్పునపుడు అందరి అంతరార్థమును వివరంగా అరటి పండు వొలిచి చేతిలో పెట్టినట్లు చెప్పి, నచ్చజేస్తారు.

సింగపూరు పడిపోవడంవలన మనకు విజయం ఆలస్యమగునే కాని, దుర్లభం కాదు. గత యుద్ధంలో గాలిపోలిలో యిట్లే ఓడితిమి, తరువాత కుటువద్ద యిట్లే ఓడితిమి. ఈ రెండూ పెద్ద ఓటమిలే. అంతమాత్రమున పూర్తి విజయం బడయుట కొంచెం ఆలస్యమయిన దేగాని, ఫలితంలో ఏమి మార్పు కలుగలేదు. కావున సింగపూరులో నష్టమయిన జనమునకు, ఆస్తికి, గౌరవమునకు మనం విచారించుచున్నప్పటికీ, ధైర్యం వీడక యింకా ఎక్కువగ నడుంబిగించి పనిచేస్తే, విజయానికి తోడ్పడిన వారమగుదుము.

అట్లాచేయుటకు ఎంతో ప్రోత్సాహం గలదు. 1940 లో ఇంగ్లాండు ఒంటరిగా యుద్ధం చేయవలసి వచ్చుటేగాక, రిజర్వు సేనలుకూడ లేకుండెను. సహాయం ముందెన్నడో వస్తుందన్న ఆశే గాని, ఎదుట ప్రత్యక్షంగా లేకుండెను. రష్యా అపుడు స్నేహభావంలేని తటస్థ రాజ్యంగానుండెను. అమెరికా జంకుచున్న మిత్రుడుగా నుండెను. 1941 లో పరిస్థితులు మారినవి. రష్యా పడిపో సిద్ధంగానుండెను, అమెరికా యిదివరకంత జంకు లేకపోయిన, స్నేహపాత్రమగు తటస్థ రాజ్యంగా నుండెను. నేడు రష్యా జర్మనీపై తిరుగుదాడి తీవ్రంగా జరిపినది; అమెరికా యుద్ధంలో దిగి తీవ్రకృషిచేయుచు మన పక్షమున్నది. జపాను కూడా జర్మనీపక్షం యుద్ధంలో దిగింది. అయినప్పటికీ, అక్షరాజ్యాలు అన్ని ప్రాంతములందును తీవ్రంగా ప్రతిఘటించబడుచున్నవి. ఇకముందు రాజకీయ ఔదార్యాలేవియుండవు.

1940 లో హిట్లరు గెలిచేస్తానని చాలధైర్యంగానుండెను. 1941 లో అతను రష్యాపైదాడి చేసినపుడుగూడ, అతను తన సేనలో కొంత ముఖ్యమయిన భాగమును మాత్రమే ఎక్కడంటే అక్కడ స్వేచ్ఛగ ఉపయోగించ గల్గుచుండెను. నేడట్లు కాదు, జర్మనీ, జపాను రెండుగూడ అన్ని సేనలను ఉపయోగించి నిరసించియున్నవి. శని వారి గొంతు నులుముచున్నది. మనం వారి దాడి నెదిరించి నిలువరించుకొన్నచో యుద్ధం గెలిచినట్లే. 1940 లో ఇంగ్లాండు బ్రతికుంటేచాలని ప్రాకులాడింది, ఇపుడు మిత్రమండలివారు గెలుపు తథ్యమని పోరాడుచున్నారు. 1940 లో మిత్రమండలికి సహాయం అందని మ్రాని పండుగ నుండెను, నేడు అది పూర్తిగ చేకూరినది. దీని కూడదీసుకొనుటకు వ్యవధిమాత్రం కావాలి. ఆలస్యంచేయుటే మిత్రమండలి కర్తవ్యం; ఓడుటే అక్షరాజ్యాల నుదిటి వ్రాత.

## బర్మాపై దాడి.

విజయోత్సాహంతో జపానువారు సరిహద్దులు దాటి బర్మాపై బడిరి. మర్తాబను రేవు వశపరచుకొని, సల్వీను నదిదాటి, యిపుడు బిలిను నదినికూడ కొంతవరకు దాటుటచే రంగూనుకు, అక్కడనుండి ప్రారంభమగు బర్మా-చీనా రోడునకు ప్రమాదం హెచ్చింది. రంగూనుకు సముద్రమార్గం ఎంతవరకు నిరోధింపబడింది అన్న విషయం సందేహంగాయుంది. ఆ రేవునకు శత్రునావలు రాకుండా చుట్టు నీటిలో మందు గనులు నాటబడినవని ఒక వార్తగలదు ఇంకో వార్త రంగూను మాల్టావలె, టొబ్రుకువలె ఎంతకాలమైనా శత్రు ముట్టడికి ఓర్వగలదని తెలుపుచున్నది. ఇంకో మార్గంలో మిత్రదేశమగు చీనాకు సరకు పోవుచున్నదను వార్తలు చాల ఆశాజనకముగనున్నవి. కావున, రంగూను జపానువారి వశమయినా, చీనా ముఖ్యపట్నమగు చుంగ్‌కింగునకు యుద్ధసామగ్రి యితర దేశాలనుండి అందకపోదు. ప్రస్తుతానికి వాటి సంఖ్య తగ్గియుండు ననుకొనవచ్చును. అయితే, రంగూను మాత్రం ఇంకా విడువబడలేదు. బర్మాలో రాయలు విమానదళం, ఆధిక్యత గల్గియుంది. నేల సైన్యాలకు క్రొత్తగా సహాయసేనలు పంపబడినవి. చీనా సేనలు ఉత్తరమునుండి వచ్చుచుండుటచేత, పడమరనతి దూరంగా త్రోసుకొని వచ్చుచున్న జపాను సేనలకు వాటి తాకిడి బాగా తగులుచున్నది.

## లిబియాలో వెనుకా ముందు.

లిబియాలో ప్రస్తుతానికి అంతా శాంతంగా వుంది. అచట గెలుపు ఓటమిలు అటుపోటులుగా నున్నవి. సముద్రపు అలలవలె వెనుకా ముందుగా నున్నవి అచటి యుద్ధం. మనం ఈజిప్టుని రక్షించి ఉత్తర ఆఫ్రికానుండి అక్షరాజ్య సేనలను తొలగించవలసియున్నది. మన 8 వ సేనను తన ఈజిప్టు త్రోవ కడ్డుగా తొలగించి రష్యానుండి ఎర్రసముద్రంవరకు వ్యాపించివున్న బ్రిటిషు రహదారులను త్రెంచవలసిన పూచీ జర్మను సేనానియగు రోమెలుపై గలదు. కావున రెండు పక్షలవారికి అచట శత్రువును శాశ్వతంగా పడగొట్టుటకు వీలగునట్లు ఒక మూలకు త్రోయుడం కర్తవ్యంగావుంది.

రోమెలు సేనాని 400 మైళ్లు వెనకకు ఎల్ అగిలేవరకు తరిమివేయబడినపుడు చాలదెబ్బ తిన్నాడు. 61,000 సైనికులు, 852 విమానాలు, 386 టాంకులు పోయినాయి. కాని అతనికి క్రొత్త సప్లైయిలు వచ్చినవి. బ్రిటిషు సేన మూలస్థానమునకు 500 మైళ్లు దూరంగా వచ్చినందున అక్కడనుండి సప్లైయిలు తెచ్చుకొనుట కష్టమయినది. రోమెలుకు క్రొత్త సప్లైయిలు చేరగనే బ్రిటిషు సేనపై ఎదురు తిరిగెను. పడమరను వేరొక రక్షణశ్రేణి సరియైనది లేక 8 వ సేన సిరెనేకనుండి ఎల్ అలిగేవరకు పోయెను ఈ రక్షణశ్రేణిని ఛేదించుటకు రోమెలు సందేహించుచున్నాడు.

రోమెలు తిరుగుదాడి సాగించినపుడు విషీ ఫ్రాంసు అక్రమంగాచేసిన సహాయం ఆధారంగా

చేసుకొని బ్రిటిషు సేనను రూపు మాపేయాలని నిజంగా తలపెట్టినో లేక, హిట్లరు వసంతరుతువు దాడి నెదుర్కొనుటకు బ్రిటిషువారి సేనలు ఇతర చోట్లను లేకుండాచేసి ఇక్కడకు తెప్పించాలన్న ఉద్దేశంతోనే యీపని చేసెనో చెప్పుటకు వీలు లేదు. కాని ప్రస్తుతానికి లిబియా పరిస్థితులు సంతృప్తికరంగా నున్నవి.

లిబియాలో ప్రధాన యుద్ధరంగము గజాలాకు పడమరను సముద్రతీరమున ఎల్ టిమినినుండి ఎల్ మకిలివరకున్న గీత ననుసరించియున్నది. ఇరుపక్షముల సేనలచట ముందువెనుకలకు ఊగులాడుచున్నట్లు యుద్ధం చేయుచున్నవి. రోమెలు యీ గీటుదాటి చాల ముందుకు వచ్చెను. కాని తీవ్రమగు దాడి ప్రారంభిస్తాడనుకునే సరికి తిరిగి సేనను వెనుకకు తగ్గించెను. బహుశ మధ్యధరాసముద్రమునందు అక్షరాజ్యాల సప్లయినౌకలను బ్రిటిషు యుద్ధనౌకలు అటకాయించుటచేతను, 20 శత్రు విమానాలను బ్రిటిషు విమానాలు కూల్చుటచేతను, రోమెలు వెనుకకు తగ్గియుండును. ఏమయితేనేమి, ఇపుడా ప్రాంతాల బ్రిటిషు సైనికదళాలు స్వేచ్ఛగ తిరుగుచున్నవి.

త్వరలో రోమెలు పెద్దదాడి ప్రారంభించనున్నాడని తెలియుచున్నది. మెకిలివద్ద అతను విశేషంగా సేనను జతచేయుచున్నాడని మన విమానాలుచూచి తెలుసుకొన్నవి. ఆదాడి నెదుర్కొని, లిబియాలోనేగాక ఉత్తరాఫ్రికానుండి పూర్తిగ శత్రుసేనలను, హిట్లరు క్రొత్తదాడి ప్రారంభించకముందే తరిమివేయాలని, బ్రిటిషు సేనాధికారులు తలపెట్టి తగు సన్నాహములు చేయుచున్నారు. జనరలు అచినులేకు సేనాని ఆధిపత్యమున సిరియాలో నొకటి ఇరాకు-ఇరానులలో నొకటి, రెండు క్రొత్త సైన్యాలు తయారుచేయబడుచున్నవి. చిరకాలం స్థిరంగా సప్లయిలు రాగలవను నమ్మకం కుదిరే వరకు, యీ పడమటి ఎడారియందు ఏపక్షం వారును తీవ్రదాడి తిరిగి ప్రారంభించరు.

## విషీ మోసం.

విషీఫ్రాంసు తటస్థంగానున్నట్లుండి, తటస్థ దేశాలకుండవలసిన సౌకర్యాలన్ని పొందుతు, తానిదివరకు స్నేహంగావున్న ఇంగ్లాండునకు ప్రతికూలముగా తన పూర్వ శత్రువగు జర్మనీకి సహాయం చేస్తున్నది. అమెరికా-ఇంగ్లాండులు రెండును యిందుకు తీవ్ర నిరసనము తెల్పినవి. 1941 వ సంవత్సరములో 2,000 లారీలు ప్రైవేటు మోటారులు ఫ్రెంచి సరిహద్దుదాటి ఉత్తర ఆఫ్రికా ప్రవేశించినవి. నవంబరునుండి 400 టన్నుల గోధుమలు, 500 టన్నుల ఆలివునూనె, 500 గాలనుల సారాయి నెలకు అక్షరాజ్యముల సేనకు విషీప్రభుత్వం సప్లైయి చేస్తున్నది. డిశంబరు మాసంలో 2,000 టన్నుల మోటారు పెట్రోలు టునీషియానుండి లిబియాలోనికి పోయింది. గతనెలలో సుమారు 2,000 టన్నుల విమానాల పెట్రోలు పోయింది. ఎలా పోతున్నాదోగూడ తెలుసు. ఐదు ఫ్రాంసు స్టీమరులు ఫ్రాంసు రేవగు మార్సెలసునుండి ఆఫ్రికాతీరమున ట్యూనిసునకు యీ సరకును రవాణా చేస్తున్నవి. అక్కడనుండి నేలమార్గమున లేక చిన్న పడవలలో లిబియాలోని జర్మను సేనలకు రహస్యంగా పంపబడుచున్నది. ఈ ఐదు స్టీమరులు ట్యూనిసునుండి వచ్చునపుడు పాస్ఫేట్సు నింపుకొనివస్తే ఆ సరకులో సగం జర్మనీ మార్సెలిసు రేవులోనే తీసుకుంటుంది. ఇదిగాక ఇండో-చీనానుండి కాసబ్లాంకా రేవునకు రబ్బరు విశేషంగా దిగుమతియై జర్మనీకి పంపబడుచున్నది.

ఫ్రాంసులోనే యిపుడు విషీ ప్రభుత్వపాలనమంటే అసహ్యం, అసంతృప్తి పెరుగుచున్నందున అది పక్వానికి వచ్చేవరకు మిత్రమండలివారు వేచియున్నారు. లేకుంటే యీపాటి, యీ మోసానికి తగిన శాస్తి చెప్పియుందురు. అమెరికా ప్రభుత్వంతో విరోధంపడితే అమెరికాకు చేరువగనున్న ఫ్రెంచి పడమర దీవులగు మార్టినిక్యు, గాడ్లోపికి మోసం కలుగుతుందని విషీ ప్రధాని డార్లానుకు భయంలేకపోలేదు. ఫ్రాంసు, స్పెయినులద్వారా ఉత్తరాఫ్రికాపై ఒత్తిడి కలిగించుటకు జర్మనీ చేస్తున్న ఎత్తులు సాగుచున్నట్లు రుజువగుటలేదు. అందుచే, కఠిన చర్యకు గడంగ నవుసరం లేకుండానే విషీమోసానికి మిత్రమండలి మర్యాదగా చెప్పిన మందలింపులు పనిచేస్తున్నట్లున్నది.

---

# రష్యా ఎర్ర సైన్యం 24 వ వార్షికోత్సవం.

## స్టాలిను క్రొత్త ఉత్తరువు, చర్చిల్ అభినందనాలు.

రష్యా ఎర్రసైన్యం 24 వ వార్షికోత్సవం రష్యాలో యీ సోమవారం జరిగింది. స్టాలినుగారికొక అభినందన సందేశం పంపుచు బ్రిటిషు ప్రధాని చర్చిల్‌గారు, యీ ఎర్రసైన్యంలోని సైనికులు నాయకులును గత 8 నెలల యుద్ధంలోను మరువరాని శాశ్వతకీర్తిని బడసిరని కొనియాడిరి. ఈ పొగడ్తకు వారెంతయు తగియున్నారు. జర్మనులను ఎదుర్కొనుటయేగాక, పడగొట్టుటకుగూడ తాము సమర్థులమని రష్యను సైనికులు ప్రపంచానికిరుజువుచేసిరి. ఆరోజున ప్రత్యేకంగా జారీచేసిన ఉత్తరువునందు రష్యను సర్వసేనాధికారియగు స్టాలిను నియంత స్వాతంత్ర్య ప్రియులగు ప్రపంచవాసులందరికీ యిట్లుభయం ప్రకటించెను :—“శత్రువును మేము లెనిన్గ్రాడు నగరద్వారంనుండి తరిమేస్తాము, శ్వేత రష్యాను విడిపిస్తాము, ఉక్రైను, క్రిమియాలను తిరిగి ఆక్రమిస్తాము, ఇదివర కెక్కడెక్కడ ఎర్రజండా ఎగిరిందో అక్కడంతా తిరిగి ఎర్రజండా స్థాపించెదము. ”

రష్యా సైన్యం యీ పనులను తూచా విడువకుండ క్రమపద్ధతిని చేస్తున్నవి. రష్యా సైనికులు నెమ్మదిగా, అన్ని ప్రాంతములందు ముందుకు త్రోసుకొనిపోవుచు, రష్యా ప్రజలను శత్రు సంకెళ్లనుండి తప్పించుచు, శత్రువునకు ఎక్కువనష్టం కలిగించుచున్నారు. లెనిన్గ్రాడు ముట్టడి త్వరలో ముగియనున్నది. స్మోలెంస్కుకు తూర్పున 50 మైళ్లలోనున్న డోరోగోబుజును రష్యనులు యీ వారం వశపరచుకొనిరి. అనగా మాస్కోనుండి 200 మైళ్లు ముందుకు వచ్చిరన్నమాట. ముఖ్య రైల్వే కేంద్రమగు రోజోవునకు 14 మైళ్ల ఉత్తరముననున్న పానినోయను ముఖ్య సైనిక కేంద్రమును తీసుకొనిరి. రోజోవు యింతవరకు ఎదురు దాడులను నిరోధించుచున్నందున దానిని చుట్టివేయుటకు పానినో వశపరచుకొనిరి. దక్షిణమున మార్షలు టిమషెంకో సేనలు డానెజ్జిలోయయందు చాలభాగం శత్రువశమునుండి తప్పించి, క్రిమియాలోని జర్మను సేనలకు ఒత్తిడి కలిగించుచున్నవి.

జర్మనీ స్థితి ఎంత క్లిష్టంగా నుండకపోతే, మ్యూనికులో యీ వారం జరిగిన ఒక ముఖ్య సమావేశమునకు రావలసిన హిట్లరు రాకుండా పోతాడు ? శీతకాలం త్వరలో ముగియనున్నందున అతడు సైనిక ప్రధాన కేంద్రస్థానం విడువ వీలులేకపోయిందని సాకుచెప్పిరి.

వసంతఋతువు రాగానే రష్యాపై తీవ్రమగు దాడి సాగింపనున్నాడని బెదరించుటకు యిట్లు తెలుపబడెను. రష్యాలో ఓడినందున హిట్లరు గౌరవంపోయినందునను, రాజకీయంగా యిక పుట్టుగతులుండవను భయంచేతను, అతడు వసంతంలో బ్రహ్మాండమగు దాడి ప్రారంభించినా ప్రారంభించవచ్చును. కాని దక్షిణ రష్యాలో చలికాలం ఏప్రిల్‌వరకు ఉండును, ఉత్తర రష్యాలో యింకొ నెల ఎక్కువవుండును. కావున స్టాలినుగారి ఉత్తరువులో సూచించిన కార్యాలు సాధించుటకు రష్యనులకు యింకా వ్యవధి యుండును. వసంతంలో రష్యాలో క్రొత్త దాడి ప్రారంభం కావచ్చును. కాని అది జర్మనీ సాగించునదేగాక, రష్యా ప్రారంభించు దాడి కావచ్చునని కొందరు సైనిక నిపుణులూహించుచున్నారు. రష్యాలోభాగమునందు శిక్షణపొందుచున్న విశేష సైన్యం యింకా పిలువబడలేదు. రష్యావారి తిరుగు దాడి నెదుర్కొనుటకు హిట్లరు నిలువయున్న తన సేననుగూడ తేవలసివచ్చెను. యుద్ధ సామగ్రిగూడ రష్యా స్వంతంగా అత్యధికంగా తయారుచేసుకొనుచున్నది. దానికి తోడుగ ఇంగ్లాండు-అమెరికాలు ఎక్కువగ సరకు పంపుచున్నవి. కావున ఒక నెల, రెండు నెలలలో తిరిగి రష్యాలో మహాయుద్ధం జరిగేటట్లుంది. ఈసారి మిత్రమండలికే ఎక్కువ అనుకూల పరిస్థితులుగలవు.

# పశిఫికు మహాసముద్ర సంగ్రామము.

## బర్మా, జావాలందు తీవ్ర యుద్ధము.

బర్మా రోడ్డు పూర్తిగ విడువబడదు—బాలిదీవివద్ద నౌకాయుద్ధము—ఫిలిప్పైన్సులో జనరలు మకార్థరు నిరోధము—డచ్చి నౌకాదళం తీవ్ర ప్రతిఘటన—అమెరికా సహాయం యెక్కువ వచ్చుట.

బర్మాలో తీవ్రయుద్ధము కొనసాగుచున్నది. తూర్పునుండి వచ్చిన జపాను సేనలు బిలినునది దాటి యిపుడు సిటాంగునదివైపు వచ్చుచున్నవి. వారు ఆక్రమించిన ప్రతిమైలు ప్రదేశమునకు ఎంతో ఎక్కువ కష్టపడి విశేషంగా సైన్యాన్ని త్యాగం చేయవలసి వచ్చుచున్నది. బ్రిటిషు సేనలు భారతీయ సేనలును వారికి తీవ్ర నిరోధం గల్గించుచు, ఎక్కువ నష్టపెట్టుచున్నవి. వాటికి తోడుగ రాయలు విమానదళము, భారతీయ విమాన దళము, అమెరికను వాలంటీరు గ్రూపు వైమానికులును, యీ రెండు నదులమధ్య బాడి వచ్చుచున్న శత్రుసేనలపై బాంబులు వేయుచు, మన నేల సైన్యములకు బాగుగ తోడ్పడుచున్నారు. ఇదిగాక మన వైమానికులు తాయిలాండుపై దాడి వెడలి శత్రుస్థానమునందెక్కువ నష్టం కలిగించిరి. వీరు కలిగించిన నష్టం, మాండలే మైమియో నగరములపై జపాను వైమానికులు కలిగించిన నష్టంకన్న ఎక్కువైనది. మిత్రమండలి వైమానికులు నేల సైన్యమునకు మలయాలో యీ రీతిగ సహాయం చేయలేదు. బర్మాలో యీ వైమానికుల సహాయం నేల సైన్యానికి చాల వుత్సాహధైర్యములను కలుగ జేయుచున్నది.

అయినా జపాను సేనలు వస్తునేయున్నవి. సింగపూరు పడిపోయినందున వారు ఆరు డివిజనులు (అనగా సుమారు 72,000 సైనికులను) బర్మాలోనికి తేగల్గిరి. సిటాంగు నదివైపు త్రోసుకొని వచ్చుచున్నారు. ఈ నది రంగూను నగరమునకు 80 మైళ్లు తూర్పుగ గలదు. చాల వెడల్పయినది, అతివడిగ ప్రవహించును, గనుక బిలిన దాటినంత సులభంగా శత్రుసేనలు దీనిని దాటలేవు. కాని, సైనిక వ్యూహ విమర్శకుడగు అనలిష్టు చెప్పినట్లు, విమానసహాయం బాగాయున్నటువంటి సాయుధ సైనికదళమునకు నదులు పెద్ద నిరోధంగా నుండుటలేదు. కనుక ఎంత కష్ట నష్టాలకైనా ఓర్చి జపానువారు నదని దాటే వచ్చెను. ఇప్పటికింకా వారు దాటలేదు. కనుక నదికి పడమరగనున్న రైల్వే ముఖ్యనగరమగు పెగూను వారు వశపరచుకొన్నారన్న మాట అబద్ధం. రంగూన్ను రక్షించుచున్న బ్రిటిషు సేనలకు ఇండియను సేనలకు తమ బలంకూడ దీసుకొనుటకు కొంత వ్యవధి చిక్కెను. పైగా వుత్తరమునుండి చీనా సేనలు వచ్చుచు, పడమటనుండి దాడి వచ్చుచున్న శత్రుసేనకు కుడివైపునుండి పోటుపొడవగలవను ధైర్యంగలదు.

ఇండియానుండి చీనాకు బర్మారోడ్డు గాక యింకో మార్గము సిద్ధం చేయబడుచున్నను, శత్రువు సముద్ర మార్గమున రాకుండ చేయుటకై రంగూను రేవుచుట్టు మందుగనులు నాటబడినను, యిపుడున్న బర్మా-చీనారోడును పూర్తిగ విడచిపెట్ట యుద్దేశంలేదు. రంగూను యింకో మాల్టావలె వేరొక టొబ్రుకువలె ఎన్నాళ్లయిన ముట్టడికి నిలువ గలదనియు, వెన్వెంటనే యీ నగరానికి ఏమి జరుగనున్నను తాను నగరమును విడుచుట లేదనియు యీ వారం బర్మా గవర్నరుగారు స్పష్టంగా తెలిపిరి. అంతేకాక, రంగూను రక్షణకై చేయవలసిందంతా చేస్తామనియు, చీనాకు ప్రాణప్రదమగు మార్గమును తెరచియుంచుటకు వుద్దేశించితిమనియు మిత్రదేశమగు చీనాకు ఆప్రకారం వాగ్దానం చేసినాము కనుక ఆప్రకారం చేసి తీరెదమనియు గవర్నరుగారు నుడివిరి.

### ఫిలిప్పైను దీవులలో యుద్ధం.

పసిఫికు సముద్రప్రాంతములందు యితర యుద్ధరంగములు ఫిలిప్పైను దీవులు, డచ్చి తూర్పు దీవులును. ఫిలిప్పైను దీవులను రక్షించుచున్న అమెరికను సేనానాయకుడు జనరలు మాకార్థరుగారు నానాటికి ఎక్కువ ప్రశంసార్హముగ పోరుచున్నాడు. శత్రుసేనల సంఖ్య తమ సేనకన్న ఎక్కువగనున్నను, వారు తానున్న బటాను ద్వీపకల్పమునందడుగు పెట్టుటకు వీలులేకుండ చేసెను. అందున్న ఫిలిప్పినో అమెరికను సేనలను జపాను సైనిక దళము కదిలింపజాలకున్నది. అట్లే మనిలా నౌకాకేంద్రమునకు ముఖ్యద్వారమువలెనున్న కోరిగిడరు కొండకోటనుండి గూడ అమెరికను సేనలను జపానువారు కదిలింపలేకున్నారు. ఆ ప్రయత్నంలో జపాను చాల నష్టపడెను. చుట్టు నేలను, సముద్రాలలో ఆకాశంపైన జరిగిన యుద్ధాలలో అమెరికనులే విజయం పొందుచు, త్వరలో గోల్పోయిన భాగం తీసుకోగలరనిపించుచున్నారు.

### బాలినౌకా యుద్ధం.

డచ్చి తూర్పు దీవులలోకెల్ల గొప్పది జావాదీవి. దీనిలోనే వావెలు బ్రిటిషు సేనాని కేంద్రస్థానంగలదు. దీనిపైకి అన్ని వైపులనుండి దాడిచేయనుద్దేశంతో జపానువారు దాని ప్రక్కన తూర్పుగానున్న చిన్న ద్వీపమగు బాలియందు తమ సేనలను దింపగల్గిరి. దానిలో కొంతభాగం కూడ ఆక్రమించిరి. కాని వారాపని చేయులోపున మిత్రమండలి విమానాలును, యుద్ధ నౌకలను వారినెదుర్కొని పోరాడి చాల నష్టం కలుగ జేసినవి. జపానువారివి 6 అంగుళములు ఫిరంగులుగల క్రూయిజరు, రెండు డిస్ట్రాయరులు ముంచబడినవి, మరి నాల్గు చాల దెబ్బతిన్నవి. జపాను యిపుడు రక్షించుకోవలసిన సముద్ర మార్గములు కడు దీర్ఘమగుచున్న యీ సమయమున ప్రతి ఒక స్టీమరు చాల విలువైనదే, ఎక్కువ ఉపయోగపడునదే, కనుక బాలిదగ్గర యీ నష్టము జపానుకి చాల కష్టముగ నుండక మానదు. మకాసరు జలసంధివద్ద యిటీవలజరిగిన నౌకాయుద్ధంలో జపానువారి నౌకగుంపు ఒకటి పూర్తిగ చెడగొట్టబడింది. ఇప్పటి బాలియుద్ధంగూడ యించుమించు అంత నష్టమును కలిగించెను. బాలియందు తామాక్రమించిన డెను పజాయు విమానాశ్రయమును కాపాడుకొనుట జపానువారికి కష్టమేయగును. దానిపై మిత్రమండలి వైమానికులు విశేషంగా బాంబులు వేస్తున్నారు. దానికి బదులుగ జావా విమానాశయములపై బాంబులు వేయుటకు జపాను వైమానికులు ప్రయత్నించుచున్నారు, కాని అంత ప్రయోజనం లేకుండాపుంది. జావాపై నాల్గు వైపులనుండి దాడిచేయాలని జపాను ఎంతకాలంనుండో యత్నించుచున్నది. పడమట సుమాత్రా వైపునుండి, ఉత్తరమున బోర్నియో సెలిబెసులు రెండు చోట్లనుండి, తూర్పున బాలినుండి. కాని బాలి, సుమాత్రాలందు డచ్చివారి తీవ్రనిరోధంవలన యీ యత్నం నిలచిపోయినట్లుంది.

### టిమూరు.

ఇంకా దక్షిణమున పోర్చుగీసువారిదగు టిమూరు దీవియందు కొన్ని జపాను సేనలు దిగినవి. పోర్చుగల్ ప్రధానమంత్రి యిందుకు నిరసనము తెలిపెను. ఇట్లా జరుగునని అదివరకే తెలిసి అక్కడకు పంపబడిన మిత్రమండలి సేనలు శత్రుదాడిని నిరోధించుచున్నవి. జపాను విమానాలు టిమూరు సముద్రంపై ఎగురుచుండగనే, అమెరికా వైమానికులు న్యూగినిలో నున్న శత్రుశిబిరమగు రెబాలుపై దాడిచేసివచ్చిరి.

### అమెరికా సహాయం—
### ఆస్ట్రేలియా ధైర్యం.

సింగపూరునకు జపాను నౌకాదళం వచ్చిందని తెలిసి, సమిష్టి రక్షణ యత్నములు ఆలోచింప న్యూజిలండు ప్రతినిధులు ఆస్ట్రేలియాకు వచ్చి అచటి మంత్రివర్గముతో చర్చించిరి. డచ్చి నౌకాదళంపై తాము ఒకసారి దాడిచేయగానే అది నాశనమయిందని జపానువారు ప్రకటించిరి. ఆడచ్చి నౌకాదళమే యిపుడు జపాను దాడులను ఎక్కువగ నిరోధించి తన సత్తువచూపుచున్నది. ఇదివరకు డిస్ట్రాయరులు, ఏరోప్లేనులు మాత్రమే అమెరికానుండి వస్తున్నవి. ఇప్పుడు యింకను ఎక్కువ సహాయం అమెరికానుండి రాగలదు. డచ్చివారికి ఎక్కువగా క్రొత్తసేనల సహాయం వస్తున్నది. కాని వారికి యింకా ఎక్కువ వెంటనే కావలసియున్నది. ఆ సహాయం వస్తే వారు బాగా జపాను దాడి నెదుర్కొని తిరుగుదెబ్బ కొట్టగలరు. ఇపుడు మూడువైపులనుండి ఎదుర్కొనబడుచున్న జావా దీవి, డచ్చివారికి సహజమగు మంకు పట్టుదలతో రక్షింపబడగలదు. కాని అది అమెరికా ఇంగ్లాండులు ఎంత వేగంగా సహాయం పంపి, తమ నౌకాబలం విమానబలం శత్రుబలంకన్న ఎక్కువ చేసుకొనగలిగితే అంత వేగంగా జరుగగలదు.

జపాను ఆశలు డచ్చి తూర్పు దీవులను మించి దూరంగా పోతున్నవి. వారి ముందెత్తు ఏమిటో

జపాను సేనాధికారులే చెప్పాలి. చీనా, బర్మా, ఫిలిప్పైనులందు, డచ్చి తూర్పు దీవులందు జపాను వారపుడే పెద్దపని కల్గించుకున్నారు. ప్రస్తుతం వారు దక్షిణ దీవులపైనే ముఖ్యంగా శక్తినంతా కేంద్రీకరిస్తున్నారు. ఈ ప్రాంతంలో స్థావర మేర్పరచుకొని ఆస్ట్రేలియాపై సమగ్రముగు దాడి ప్రారంభించక పోవచ్చును అని లండను టైమ్సుపత్రిక ఊహించుచున్నది. డచ్చి తూర్పు దీవుల లెఫిటినెంటు గవర్నరు డాక్టరు వానుమూక్ గారు, అమెరికానుండి మరలివచ్చుచు, ఆస్ట్రేలియా రేవు నగరమగు సిడ్నీయందు మాట్లాడుచు, శత్రువుపై తిరుగు దాడులు సలుపాలనియు ఒక రక్షణ శ్రేణినుండి వేరొక రక్షణ శ్రేణికి వెనుకకు మరలుట ఎల్లకాలం చేస్తూవుంటే యుద్ధంలో ఓటమి కలుగవచ్చుననియు హెచ్చరించిరి. ఆస్ట్రేలియా అటువంటి పొరబాటు చేయదని లండను టైమ్సుపత్రిక అభిప్రాయం.

---

# "ఎన్ని పరాజయాలు కలిగినా విజయం తప్పదు."

# బ్రిటిషు ప్రధాని చర్చిల్ ప్రసంగము.

**పశిఫిక్ యుద్ధమున వెనుకబడుటకు కారణములు—నౌకా నష్టములు—రష్యా-అమెరికాల సహాయం—భావి సూచన.**

బ్రిటిషు ప్రధాన మంత్రి చర్చిల్‌గారు యీ 24 వ తేదిన కామన్సు సభలో గడచిన కొద్ది నెలల యుద్ధ క్రమంగూర్చి తెల్పుచు, ఎన్ని పరాజయాలు కలిగినా విజయం తప్పదని తెలిపిరి. జపాను అకస్మాత్తుగ దెబ్బ తీయుటవలన ఇప్పట్లో మనం కొంత నష్టపోయినా, దూరదృష్టితో ఆలోచిస్తే, విశాలంగా భవిష్యత్తు సంగతి చూస్తే, మన పరిస్థితులు గత రెండేండ్లలోను, ముఖ్యంగా గత కొద్ది మాసాలలోను బాగుపడినవనే చెప్పవచ్చుననిరి. అమెరికా తన అనంతసంపదతో యుద్ధంలో చేరుటయు, రష్యాయొక్క అద్భుతశక్తియు, యీ యభివృద్ధికి కారణము లనిరి. పశిఫిక్ సముద్ర ప్రాంతములందు జపాను సేనలు 26 డివిజను లుండెననియు, అంత యెక్కువ మన సేన లేకుండెననియు వెన్వెంటనే మరికొన్ని నష్టాలు కలిగిన సంయుక్త రాజ్యాలకే చివర విజయం తప్పదనిరి. యుద్ధ కార్యనిర్వాహణకు తమ మంత్రివర్గం కొద్దిగ మార్పుచేయవలసి వచ్చిందనిరి.

జపాను యుద్ధంలో అకస్మాతుగ దిగుటగూర్చి చెప్పుచు, జర్మనీ ఇంగ్లండుపై దండెత్తి రానున్నందునను, అట్లాంటికులో జర్మనీతో పోరాడుచున్నందునను, సూయజుకాల్వ ఈజిప్టులకు రక్షణగ నున్న లిబియా ఎడారిపై జర్మనీ-ఇటలీలు దండెత్తి నందున దాన్ని రక్షించుకొనుచుండుటచేతను,యిదే సమయంలో జపాను పశిఫిక్ ప్రాంతముల అకస్మాత్తుగ దెబ్బకొసినందున ప్రస్తుతానికి ఆ ప్రాంతంలో ఆధిపత్యం లభించిందనిరి. తమ జలాంతర్గాములు నౌకలన్నియు తమ దేశానికి సరకు ఆహారపదార్థములు తెప్పించుకొనుటయందును, వివిధ యుద్ధ రంగాల సేనలకు సరకు గొంపోవు స్టీమరులకు కాపలా యుండుటచేతను, గత రెండు నెలలలో తమ నౌకలకు నష్టం ఎక్కువైందనిరి.

### సింగపూరు పతనం.

ఆదివరకు చాల తీవ్రయుద్ధానికి గురియై అనేక ప్రదేశాలను రక్షించవలసిన బాధ్యతగల బ్రిటను సాగదీయబడినసమయమున దానిపై 800 లక్షల యుద్ధ ప్రియుల జనసంఖ్యగల జపాను అకస్మాత్తుగ యుద్ధానికి దిగింది. యూరోపు ఆఫ్రికా యుద్ధరంగము లందు అవసరములనుబట్టి పశిఫిక్ ప్రాంతములందు రక్షణ యేర్పాటులు తక్కువగ సంచబడెను. అక్కడనే జపాను మహాతీవ్రతమగు దాడి ప్రారంభించెను. అందుచే తాత్కాలికంగా కొంత అప్రియమగు చిక్కులలో పడితిమనిరి.

జపాను యుద్ధం ప్రారంభించగనే యితరచోట్ల అవసరమున్నప్పటికి అక్కడనుండి సింగపూరునకు 40,000 సైన్యం, విమానాలు, విధ్వంసక ఫిరంగులు, టాంకులను కొట్టే ఫిరంగులను పంపితిమి కాని అవి చేరేలోపున సింగపూరు శత్రువశమయిందనిరి. తొమ్మిది కాన్వాయిలలో సింగపూరునకు సహాయం పోయింది. అది చేరియుంటే ఫలితం వేరువిధంగా నుండేది. సింగపూరు నౌకాదళకేంద్రం కాని, దుర్గం కాదు. నౌకాదళ రక్షణ దృష్టితో నిర్మింపబడింది. ఆనౌకాదళం విమాన శక్తిపై నాధారపడియున్నది. జోహెహారునందు కట్టబడిన రక్షణ శిబిరాలు శత్రుదాడికి నిలువలేక పోయినవి. దీవిపై నిర్మించిన రక్షణ కట్టడము లంత యెక్కువ లేవని తెలిపిరి. ఇపుడా విషయమున తీర్పు చెప్పదలచుకోలేదనియు, అచట యుద్ధ ఖైదీలుగా 73,000 మందిని పట్టుకొన్నట్లు జపాను వారు ప్రకటించిరి గాని, అంతకన్న చాల ఎక్కువ మంది సింగపూరు శిబిరంలో అపు డుండిరనియు చెప్పిరి.

"పశిఫిక్ ప్రాంతములందు జపాను సేనలు 26 డివిజనులు (సుమారు 3½ లక్షలు) వున్నవి. అమెరికా,ఇంగ్లాండు సేనలకు సప్లైలు రావడంకన్న జపాను సేనలకు సప్లైలురావడం సులభం. అంత ఎక్కువసేన యిపుడా ప్రాంతమున మనకు లేదు. ఇప్పటికి నౌకా దళాధిపత్యం, ఆకాశంపై అధికారం శత్రువునకే గలదు. మన విమానాల సహాయం పోవుటకు కష్టమగుచున్నది. విమానాలు పైకెగరకుండా నేలనే నాశనంచేయబడుచున్నవి.

అందువల్ల, ఇంకా అనేక విపత్తులు పరాజయములు కష్టాలు కలుగగలవని మనం అనుకొనవలెను. 1½ సంవత్సరాల క్రిందట మన దేశానికి ఉపద్రవంగానున్నపుడు మన ప్రజలలోని వుత్తమగుణములు బయల్పడినవి. అపుడు మనదేశమే అందులో దిగియుండినందున ఆ కష్టాలను మనం భరింపగలిగితిమి. ఇప్పుడు మన దేశమునకుగాని మన ప్రజలకుగాని వుపద్రవం లేనిందునపుడు యీ పరాజయాలు కలుగుటవల్ల అవి భరించడం కష్టంగావుండును.

### ఆశా కిరణాలు.

జపానుయొక్క అకస్మిక పోటువల్ల మనం యిప్పట్లో అనుభవించిన శిక్షలను మాత్రమేగాక, దూర దృష్టితో విశాలయుద్ధరంగములను గమనించి ముందుకాలం గురించి ఆలోచిస్తే యుద్ధం మొత్తం వ్యవహారాలన్ని గమనిస్తే, గత రెండు సంవత్సరాలలో నేగాక, గత కొద్ది మాసాలలో మన స్థితి చాలా బాగుపడిందని మనకు స్పష్టంగా తెలియగలదు. రష్యాయొక్క అద్భుతబలము శక్తివల్లను, అమెరికా తన అనంత సంపదతోగూడ మిత్రమండలిలో చేరుటవల్లను, యీ యభివృద్ధి కలిగినదని వేరే చెప్పనక్కర లేదు. ఎంతటి ఆశాపూరితుడైనవాడుకూడ జోశ్యం చెప్ప సాహసింపలేనంత ఎక్కువగ మన స్థితి బాగుపడింది. మనం గడచవలసిన కష్టకాలం దీర్ఘమో కురుచో మనం చేసే యత్నంపైని మన ప్రవర్తనపైని ఆధారపడి యుంటుంది. ఆ కృషిపైనే బ్రిటను, అమెరికా, చీనా, రష్యా మున్నగు దేశాలన్నింటిపై దూకిన శత్రువులపై ఆ సమిష్టి దేశాలు అంత్య విజయం ఆధారపడియుండును. మనం అనేక కష్టములను దాటి బాధలను అనుభవించ వలసియుండును. కాని ఏ మాత్రం సడలింపని యత్నంతో, అజేయమయిన దీక్షతో ప్రతివారు పనిచేస్తే మనలోమనం కొట్లాడకపోతే, మన మిత్రులకు తప్పిపోకుంటే, అనేక మాసాల దుఃఖం కష్టం దాటినాక, పరిపూర్ణ విజయం పొందగలం."

అనిచెప్పి చర్చిలుగారు గత యిరోపాయుద్ధం జరుగుచున్నపుడు 1915 వ సం॥ నవంబరు 15 వ తేదిన తాను చెప్పిన మాటలనే యిప్పుడు మళ్లా చెప్పుచున్నాననియు అప్పటికి యిప్పటికి ఏమి మార్పులేదనియు చెప్పి ఆ మాటలను యీ దిగువ రీతిగ వుదహరించిరి.—"యుద్ధ క్రమంగూర్చి నిరుత్సాహ పడవలసిన కారణం లేదు. మనకు యిపుడు కాలం బాగాలేదు. బాగుపడడానికి ముందు యింకా అధ్వాన్నం కావచ్చును. కాని మనం సహించి పట్టుదలగానుంటే మన స్థితి బాగగుననుటకు నాకు ఏమాత్రం సంశయంలేదు. పూర్వకాలంలో యుద్ధములు వాటి సంఘటనలబట్టి, వాటి తత్వంబట్టికాక, నిర్ణయమయ్యేవి. ఈ యుద్ధంలో సంఘటనలకంటె తత్వ పరిణామాలు చాల ముఖ్యమైనవి. ఏ గొప్ప గెలుపులులేకనే మనం యీ యుద్ధంలో విజయం పొందవచ్చును. అమిత ఆశాభంగకరమైనవి విసుగు పుట్టించునట్టి సంగతులు జరుగుచుండగానే మనం గెలువవచ్చును. జర్మనులు ఆక్రమించిన ప్రాంతాలన్ని తిరిగి ఆక్రమించనక్కరలేదు. వారి రక్షణ శ్రేణులను ఛేదించుట గెలుపునకు అవసరంకాదు. జర్మను లాక్రమించిన నగరాలలో వారి పతాకం ఎగురుచుండగనే పైకి వారి సేనలకు మిలిటరీ విజయములు కలుగుచున్నట్లుండగనే యుద్ధం మొదటి వత్సరంలోనే బెర్లిను నగరమునందు మిత్రమండలి సేనలు ప్రవేశించ నవసరం లేకుండగనే రెండో సంవత్సరం లోనో మూడో సంవత్సరంలోనో జర్మనీ పరాజయం పొందవచ్చును." ఆ యుద్ధంలో జర్మనీ యిదో ఏటగాని ఓడిపోలేదు. నేడు మన యుద్ధం మూడో ఏట నున్నాము. పై వాక్యాలలో జర్మనీకి తోడుగా జపాను అనికూడ చేరిస్తే ఆ మాటన్ని యిపుడుకూడ నిజమవుతాయని తాను నమ్ముచున్నానని చర్చిలుగారు తెలిపిరి.

# "ఫ్యూరియసు"



విమానాలను మోసుకపోయే బ్రిటిషు యుద్ధ నౌకలలో నొకటి. నడి సముద్రాలలో విమానాశ్రయంగానుండి యిది పెక్కు నౌకాయుద్ధముల విజయమునకు తోడ్పడెను. దీని వడికి కెరటాలుపొంగుచున్నవి.

---

# వసంతసమరము.

హిట్లరుయొక్క సేనలు తమ వీరావేశంచూపించి, "జయ విజయీభవ! దిగ్విజయీభవ"! అని తమ ప్రతాపమును ప్రకాశింపజేసి, ఎత్తిన ధ్వజం దింపకుండా, రణరంగములలో ముందంజవేసి యిక్కడికే రమారమి మూడు లేక నాలుగు మాసములు కావచ్చినది. మూడు నాలుగు మాసాలనుంచీ జర్మను సేనలు రష్యాలో వెనుకంజవేస్తూఉన్నాయి. ఇదివరలో మాస్కో నగర సమీపమునకు చేరియుండిన జర్మను సేనలు ఇప్పటికే 250 మైళ్లు దూరముగా వెనుకకు తరిమివేయబడినవి. రష్యాకు మాస్కోనగరం ముఖ్యపట్టణం. దానిని ముట్టడించి ఆక్రమించవలెనని జర్మను సేనలు నానాఅవస్థలుపడి, చచ్చి చెడి చేయంగల విన్యాసములు అన్నట్లుగా మాస్కోనగరంవరకు చేరినవి. కాని మాస్కో నగరం వద్ద యుద్ధం చెయ్యలేక అక్కడనే స్తంభించిపోయినవి. రష్యను సేనలు విజృంభించి, మాస్కోచెంతను స్తంభించిన జర్మను సేనలను, పడమరగా స్మాలెంస్కు నగరంవరకు, కుక్కలను తరిమినట్లుగా తరిమివేసినవి. మాస్కో నగరం ఎంత పెద్ద నగరమో, రష్యాలో లెనిన్‌గ్రాడు నగరం కూడా అంతటి బ్రహ్మాండమైన మహానగరం. దానిని కూడా ముట్టడించి ఆక్రమించవలెనని జర్మనుసేనలు లెనిన్‌గ్రాడు నగరంచుట్టూ జోరీగలు చేరినట్లుగా చేరినవి. మాస్కో నగరానికి ఉత్తరంగా లెనిన్‌గ్రాడు నగరంవుంది. మాస్కోకు లెనిన్‌గ్రాడుకు రైలుమార్గంవుంది. మాస్కోకు లెనిన్‌గ్రాడుకు మధ్యనున్న ప్రదేశాలనుకూడా జర్మనులు ఇదివరలో ఆక్రమించారు. కాని, యీ ప్రదేశాలను తిరిగి రష్యనులు వశపరచుకొన్నారు. లెనిన్‌గ్రాడు చుట్టూ జర్మనులు ఫిరంగులను, చిన్న చిన్న బురుజులను ఏర్పాటుచేసికొని, ఇక మనకు ఇక్కడనుంచి చలనంలేదన్నట్లుగా మకాముచేసి యున్నారు. ఈ జర్మను దుర్గశ్రేణీవలయమును రష్యనులు ఇప్పుడు భేదించుచున్నారు. "భలో! ఉటో! జాక్" అని అక్కడి జర్మను సేనలకు రష్యనులు ఉద్వాసను చెప్పుచున్నారు. ఉచ్చాటన మంత్రం జపించగానే భూత పిశాచములు లేచిపోయినట్లుగా జర్మను సేనలు పటాపంచలై పారిపోతున్నాయి. చక్కగా మూటాముల్లె కట్టుకొని, కాలికి బుద్ధిచెప్పి వెళ్లిపోతే బాగానేఉండును. కాని, అట్లా సవ్యంగా వెళ్లడంలేదు. రష్యనుల చేతులలో తన్నులుతిని, చావుతప్పి కన్ను లొట్టపోయిన దన్నట్లుగా, తమ ఫిరంగులను, తమ ఫిరంగి మోటారులను, తమ సేనలను ఎక్కడివక్కడ నష్టపడి, అవన్నీ నాశనమైన తర్వాత, దిక్కుమొక్కులేని పక్షులవలె నలు వైపులకు చెల్లా చెదరుగా పారిపోతున్నారు. జర్మనులు విడిచిపెట్టిపోయిన టాంకులు (ఫిరంగి మోటార్లు) రష్యనుల వశమౌతున్నాయి.

## రష్యాతో యుద్ధం హిట్లరుకు అలవికానిపని

జర్మను ప్రతాపం అంతా ఇప్పుడు రష్యాలో బయటపడింది. మొట్టమొదట 1941 వ సం॥ జూన్ 22 వ తేదీ ఆదివారమునాడు చండప్రచండముగా మూడోకన్ను తెరచిన ప్రళయకాల రుద్రునివలె హిట్లరు తన సేనలతో ఆకస్మికంగా రష్యామీదకు దండెత్తి దుమికినాడు. మూడు నాలుగు మాసాలలో రష్యాను మాడ్చి భస్మంచేస్తాను అని ప్రతిజ్ఞచేసి దండయాత్ర సాగించాడు. అనుకున్న కాలం జరిగింది. కాని అనుకున్న ప్రకారం జరుగలేదు. తరువాత హిట్లరు ఒక ఉపన్యాస సందర్భంలో అన్నాడు. "రష్యామీదకు దండెత్తడం అనేది నా జన్మలో నేను తలపెట్టిన బ్రహ్మాండమైన కార్యంగా భావిస్తున్నాను" అని హిట్లరు అన్నాడు. ఆ మాటకు అర్థమేమిటి అంటే, "నా శక్తికిమించిన వస్తాదుమీద సవాలు చేసి కుస్తీకిదిగినాను" అని అర్థము. 'రష్యాతో జర్మనీ సఖ్యతగా ఉంటూఉండి, ఆఖరు క్షణంవరకు నమ్మించి, ఎంతో ఆంతరంగికంగా "భాయి! భాయి!" అని మాట్లాడుతూ, రాయబారుల ద్వారా పరస్పర సంభాషణలుచేస్తూ, హఠాత్తుగా, వెనుకనుంచి కత్తితో పొడిచినట్లుగా రష్యామీదకు జర్మనీ దూకింది. అంతపని, అంత ఆకస్మికంగా, అంత కపటమోసంగా, జరుగుతుందని రష్యా ప్రభుత్వం అనుకోలేదు. అందువల్లనే రష్యా వెంటనే శత్రువును ఎదిరించి సర్వసన్నాహములతో పోరాడ లేకపోయింది. ఆ జర్మను సేనలు శరపరంపరలుగా తలవని తలంపుగా మీదికి వచ్చిపడుతూఉంటే, రష్యను సేనలకు ఊపిరిసలుపలేదు. ఆకారణంచేతనే రష్యనులు యుద్ధారంభములో వెనుకకు పోవలసిన అవస్థ ఏర్పడింది అని రష్యా ప్రభుత్వాధిపతియైన స్టాలిను అన్నాడు. కాని, గత మూడు నాలుగు మాసాలనుంచీ, జర్మనుసేనలే వెనుకకు పోవలసిన అవస్థ ఏర్పడింది, చూడండి! యుద్ధచక్రం ఎట్లా తిరుగుతున్నదో! ఇందుకు హిట్లరు ఏమని సమాధానం చెప్పుచున్నాడంటే, "ఈ రష్యాలో మేము యీ చలి, యీ మంచు భరించలేకుండా ఉన్నాము. అందువల్ల వెనుకకు పోతున్నాము" అని అంటున్నాడు. అయితే, యీ చలిబాధ జర్మనులకు ఒక్కరికే ఉన్నదా? రష్యనులకుమాత్రం లేదా? యీ చలిలోను, యీ మంచుగడ్డలలోను రష్యనుసేనలు ఎట్లా యుద్ధం చెయ్యగలుగుతున్నాయి? రష్యాలోఉండే చలి ఎటువంటిదో హిట్లరుకు అంతకు పూర్వం తెలియనే తెలియదా? ఆ సంగతి ఆదివరకే తెలిసి

నట్లయితే, అందుకు ప్రతిక్రియగా తన సేనలకు ఏమి ఏర్పాట్లు చేసినాడు? తాను తన యుద్ధయాత్రా కార్యక్రమంలో ఏమి చెయ్యవలెనని నిర్ణయించుకొన్నాడు? చలికాలం రాకపూర్వమే రష్యాను జయించగలననే అహంకారంతో దిగియుండవచ్చును. అందువల్లనే అంత అహంకారంతో వెళ్ళినవానికి తగిన ప్రతీకారం జరుగుతోంది. ఆఖరుకు కత్తి కిందపెట్టి రష్యా జోక్యమున కికరాను అని చెప్పి చెంపలువాయించుకొని అహంకారంవిడిచి నమస్కారం చెయ్యవలసిన కాలంకూడా సమీపిస్తోంది. కాబట్టి తన సేనలు రష్యాలోని చలికి బలియగుచున్నవని హిట్లరుచెప్పే సమాధానంలో అర్థంలేదు. ఇంతకూ, హిట్లరు చెప్పినవిధంగానే "జర్మను సేనలకిది చెడ్డకాలం. హిట్లరుకు రోజులు బాగాలేవు". ఆమాట నిజం. ప్రత్యక్ష ప్రమాణంగా ఆ విషయం కన్పిస్తూనే ఉంది.

ఈ రష్యా యుద్ధము విషయంలో ఇంకొక్క సందర్భంకూడా మనము బాగా ఆలోచించాలి. రష్యామీదకు హిట్లరు దండయాత్ర సాగించినప్పుడు, కేవలం తన జర్మను సేనలతో మాత్రమే రాలేదు. (1) ఫిన్లండు సేనలను, (2) హంగరీ సేనలను, (3) రుమేనియా సేనలను, (4) ఇటలీ సేనలను, (5) ఆఖరుకు తటస్థంగా ఉంటున్న స్పెయిను దేశంనుంచి వచ్చిన వాలంటీరు పటాలములనుకూడా తనకుతోడుగా తెచ్చుకొని యుద్ధం చేశాడు. రష్యాతో యుద్ధంచెయ్యడంఅంటే బ్రహ్మాండమైన పని. 2,500 మైళ్ళ పొడుగున ఉత్తరమునుండి దక్షిణమునకు విస్తరించిన అఖండమైన యుద్ధరంగాలలో ఏకధాటీగా యుద్ధం చెయ్యవలెనంటే, తన జర్మను సేనలనుమాత్రమే వెంటతెచ్చుకుంటే, హిట్లరు తలపెట్టిన యీ దండయాత్ర సాగుతుందా? తలక్రిందుగా తపస్సుచేసినా, అది సాగేపనికాదు. అందువల్లనే తన ముఠాలో చేరిన రాజ్యాల తాలూకు సేనలనన్నింటినీ వెంటబెట్టుకొని వచ్చాడు. దీనినిబట్టి చూచినప్పటికీ, రష్యా యుద్ధంఅనేది హిట్లరుకు అలవికాని పనియని అర్థమౌతోంది.

## రష్యనుల స్థిర సంకల్పం

మొన్న 23 వ తేదీని సోవియటు రష్యాప్రభుత్వముయొక్క సైన్యప్రతిష్ఠాపనా వార్షికోత్సవం జరిగింది. సోవియటు రష్యాయొక్క ఎర్రజెండా చేతబట్టిన యీ సైన్యాన్ని ఎర్రసైన్యం అంటారు. పూర్వం రష్యాను పాలించుచుండిన జార్ చక్రవర్తుల పై తిరుగుబాటుచేసి ఆ చక్రవర్తుల పరిపాలన అంతమొందించి సామ్యవాదపద్ధతిగా క్రొత్తప్రభుత్వమును ఏర్పాటుచేసిన ఎర్రసైన్యం ఇది. ఇప్పటికి యీ సోవియటు ఎర్రసైన్యమనేది ఏర్పడి 23 సంవత్సరములైనది. ఈ ఎర్రసైన్యముయొక్క వార్షికోత్సవ సందర్భంలో ఉపన్యసిస్తూ, స్టాలినుగారు యీ క్రింది విషయాలు కొన్ని చెప్పినారు:—

"జర్మనీ మన మీదకు ద్రోహంగా దండెత్తి వచ్చింది. ఆవిధంగా ఆకస్మికంగా దండెత్తివచ్చుటవల్లనే, త్వరగా రష్యాను జయించగలమని హిట్లరు భ్రమించాడు. యుద్ధప్రారంభంలో రష్యనులు వెనుకకు తగ్గిరిగాని, ఆఖరుకు ఎర్రసైన్యం విజృంభించగలకాలం వచ్చింది. దక్షిణమున క్రిమియాలో టిఖివిన్, రాస్టావ్ వద్దను, మాస్కో వద్దను శత్రువు ఓడించబడినాడు. మాస్కో, టూలా ప్రాంతము వద్ద శత్రునిశ్శేషము చేయబడెను. డజనులకొలది పట్టణములు తిరిగి రష్యనులవశమైనవి. వందలకొలది గ్రామములు మరల మనచే జిక్కినవి. జర్మనీపక్షమున జర్మనీయొక్క మిత్రరాజ్యాల సేనలు పోరాడుచున్నవి. కాని, రష్యాసేనలు అన్యసేనల సహాయం పొందవలసిన అవసరం లేకుండానే ఇంతవరకూ పోరాడుతున్నవి."

స్టాలినుగారు చెప్పిన యీ మాటలలో అసత్యమేమీలేదు. ఇవి అక్షరాలా మన కండ్లయెదుట జరుగుచున్న నిజమైన సంగతులు.

కాని, స్టాలినుగారు ఇంకొక్కమాట అన్నారు. "హిట్లరు ఇప్పటికే ఓడిపోయినాడని నమ్మవద్దు. జర్మనులు ఏదో ఒక తంత్రం మనము ఊహించనటువంటిది చేస్తారు. ఏదో ఒక కొత్త ఎత్తు రహస్యంగా ఆలోచించి, ఆకస్మికంగా దానిని ప్రయోగిస్తారు......కనుక ఇకముందు కఠినయుద్ధం జరుగవలసియున్నది. విజయమును సాధించుటకు మనము క్రొత్తసేనలను రెండింతలుగా యుద్ధరంగమునకు పంపవలసియున్నది" అని స్టాలిను మహాశయుడు అన్నాడు.

స్టాలిన్ చాలా స్థిరసంకల్పుడు. భల్లూకపు పట్టుగలవాడు. "స్టాలిన్" అనే రష్యను మాటకు "ఉక్కుమనిషి" అని అర్థము. కనుక హిట్లరుయొక్క అంతు కనుక్కోకుండా స్టాలిన్ నిద్రపోడు. అందుకనే స్టాలినుగారు మొన్నటి ఉపన్యాసంలో అన్నారు "హిట్లరుయొక్క ముఠా అంతా అంతమైపోవలసిందే. హిట్లరువంటి వాళ్ళు ఎందరైనా రానియ్యండి. ఎందరైనా పోనీయ్యండి. కాని, జర్మనీ రాజ్యం ఎక్కడికీ పోదు. జర్మను ప్రజలు ఎక్కడికీపోరు. కాబట్టి జర్మను ప్రజలను యీ రష్యను ఎర్రసైన్యం నాశనముచేయవలెనని ఉద్దేశించియున్నదనుట అసత్యం. ఆ రీతిగా హిట్లరు తన జర్మనుప్రజలతో చెప్పి వాళ్ళను ప్రబోధించి, వాళ్ళకు రోషావేశాలు పుట్టిస్తున్నాడు. కాని, అది రష్యాను దూషించుటకొరకై చెప్పే మాట. అది వట్టి పొగరుబోతుమాట. అది బుద్ధిహీనమైన అభూత అసత్యకల్పన." స్టాలిన్ ఎటువంటి శుద్ధసంకల్పంతో యుద్ధం చేస్తున్నాడో ఆ మాటలనుబట్టి స్పష్టమౌతోంది.

## అన్ని దేశాలలో ఆయుధోత్పత్తి.

రష్యాలో ఇప్పుడు ఆయుధాలు ఎంత ఎక్కువగా తయారవుతున్నవో చూచివచ్చిన ఒక పత్రికా విలేఖరి ఆ విషయం తెలియజేశాడు. కొన్ని రకముల ఆయుధములలో జర్మనీకంటె రెండింతలుగా రష్యనులు తయారుచేసి నిల్వచేసినారు. జర్మను ఫిరంగులకంటె రష్యను ఫిరంగులు చాలా ఎక్కువ ప్రశస్తమైనవి అని చాలా దేశాలనుంచి రష్యాకు వచ్చి చూచినవాళ్ళు చెప్పినారు. ఫిరంగి మోటారులు (టాంకులు) విషయంలో రష్యనులు అత్యధికంగా తయారుచేస్తున్నారు. ఇటీవల జర్మను సేనలను ఓడించి తరిమివేసినప్పుడు వారివద్ద వుండిన టాంకులు అత్యధికంగా రష్యనుల వశమైనవి. వానినే తిరిగి రష్యనులు ఆ జర్మను సేనలపై ప్రయోగిస్తున్నారు. మరతుపాకులలో జర్మనులకంటె అత్యధికంగా రష్యనులు తయారు చేస్తున్నారు. ఇక సైనికుల సంఖ్యలో రష్యాకు చాలిన రాజ్యం ఇంకొకటిలేదు. రష్యాలోని ప్రతి పురుషుడు యుద్ధసంబంధమైన సేవకు తయారు కావలెనని స్టాలిన్ ఆర్డరు చేశాడు. అయితే జర్మనులుమాత్రం నిద్రపోతున్నారా? అని అంటారేమో. జర్మనులు నిద్రపోవడం లేదు. బ్రిటిష్ ఆర్థిక సమరమంత్రియైన డా॥ హ్యూ డాల్టనుగారు మొన్న షిల్డ్సులో ఉపన్యసిస్తూ యీ క్రింది విధంగా చెప్పియున్నారు:—

"అమెరికాలోను, ఇంగ్లండులోను ఆయుధోత్పత్తి హెచ్చుగా సాగుచున్నదనే భయము పడమటి వైపునుంచి జర్మనీని ఆవరించుచున్నది. రష్యాయొక్క బలము విజృంభించుచున్నదనే భయము అటు తూర్పువైపునుంచి జర్మనీని ఆవరించుచున్నది. అందువల్ల జర్మనులు సర్వశక్తులను వినియోగించి పనిచేస్తున్నారు."

పై జెప్పిన బ్రిటిష్ ఆర్థికసమరమంత్రిగారికి యీ క్రింది రీతిగా కొన్ని వివరములు తెలిసినవి. "జర్మనీలోని కార్మిక శాఖామంత్రియగు డాక్టరు లేగారు జర్మనీ అంతటను సంచారంచేసి ఆయుధాల ఫ్యాక్టరీలలోని పనివాళ్లను హెచ్చరిస్తున్నాడు. వారిచేత రోజు 1 కి 16 గంటలసేపు పనిచేయిస్తున్నారు. 'జర్మనీరాజ్యం సజీవంగా బ్రతికివుండవలెనంటే ఇంకొక్క ఆరు నెలలు మీరు కష్టపడితే చాలును. ఇదే ఆఖరుగడువు,' అని హెచ్చరిస్తున్నాడు. రెక్కలమోటారు లనబడే వాయుపతంగములను (గ్లైడరులను) జర్మనీలో అత్యధికంగా తయారుచేస్తున్నారు. (వీటిని విమానాలకు రైలుపెట్టెలవలె తగిలించవచ్చును)

జర్మనీ చేయుచున్న నూతన యుద్ధసన్నాహములనుబట్టి చూస్తే ఇంకొక్క ఆరు నెలలు కష్టపడితే చాలు యుద్ధం సమాప్తి అవుతుంది అనే ధైర్యంతోనే జర్మనీ కష్టపడుచున్నదని అర్థమౌతోంది.

ఈ చలికాలము వెళ్లిపోగానే కొంచెం ఎండలు ముదరగానే యుద్ధం తిరిగి జోరుగా సాగిస్తాము అని హిట్లరు యిదివరకొక ఉపన్యాసంలో చెప్పియున్నాడు. ఏప్రెలు మాసంలో అక్కడ ఐరోపా ఖండంలో మంచు గడ్డలన్నీ కరిగిపోతూ ఉంటాయి. మనకు తెనుగు సంవత్సరాది పండుగతో చైత్రమాసం ప్రారంభమవుతుంది. చైత్ర, వైశాఖ మాసములు వసంత ఋతువు. మనకు వైశాఖం, జ్యేష్ఠం, ఆషాడం జరుగుతూ ఉండేటప్పుడు అక్కడ యూరపు ఖండాలలో వసంత ఋతువు జరుగుతూ ఉంటుంది. ఇంగ్లీషు క్యాలెండరు ప్రకారంగా ఏప్రెలు-మే-జూను మాసాలలో వాళ్లకు వసంత ఋతువు నడుస్తూ ఉంటుంది. హిట్లరు యీ వసంత ఋతువు కోసం ఎదురు చూస్తున్నానని అన్నాడు.

అమెరికా ప్రభుత్వాధిపతియైన రూజువెల్టుగారు మొన్న రేడియోలో ఉపన్యసిస్తూ ముందు జరుగవలసిన కర్తవ్యమునుగూర్చి ఇట్లు చెప్పియున్నారు.

"విజయమునకు మార్గము కలదు. జపానుపై దెబ్బ కొట్టవలెను. జపాను కన్న ఎక్కువ యుద్ధనావలను విమానములను, ఆయుధములను ఉత్పత్తిచేసి అన్ని విధముల జపానును ఓడించవలెను."

రూజువెల్టుగారు వజ్రపు తునకవంటి ఇంకొక మాటకూడా అన్నారు:—"మన నౌకా బలమును మన విమాన బలమును మన దేశంలోనే ఉంచుకొనవలెనను వాదము చాలా అపాయకరమైనది. మనము మిత్రదేశములకు సహాయము చేయకపోయినయెడల, వాటిని మొదట శత్రువు జయించి తర్వాత మనలను జయించును...కూపస్థమండూకనులవలె మనము మన దేశములోనే ఒదిగి

యుండక, పక్షులవలె దూరదేశములకు పోయి శత్రువుల సంహరించుట వివేకము ”.

అమెరికానుండి రష్యాకు, ఇంగ్లాండుకు, చైనాకు ఆయుధాలను పంపి అచ్చట ఆదేశాలవారు జర్మను సేనలను, జపాను సేనలను హతము చేయుటకు అమెరికా ప్రభుత్వము బ్రహ్మాండమైన ప్రయత్నం చేస్తున్నది. ఏయే సముద్ర మార్గముల గుండా యీ ఆయుధ సామగ్రులు ఆ దేశాలకు రవాణా కావలెనో, ఆ సముద్రమార్గములను రక్షించుకొనుటకుకూడా అమెరికా పూనుకొని, యావత్తు బందోబస్తులను చేయుచున్నది. రూజువెల్టుగారు మరొకమాట స్పష్టంగా లోకానికి వెల్లడించారు :—“ అమెరికాలోని ఫ్యాక్టరీలు దేశరక్షణాపేక్షతో పని చేయుచున్నవేగాని, వ్యాపార లాభాపేక్షతో పని చేయుట లేదు క్రొత్త ఆయుధ ఫ్యాక్టరీలను స్థాపించుచున్నాము. ఇప్పుడున్న ఫ్యాక్టరీలను అనేకము ఆయుధ ఫ్యాక్టరీలుగా మార్చుచున్నాము ”.

బ్రిటిషువారికి అమెరికాలో తయారైన ఆయుధాలు అపారంగా సప్లయి అవుతున్నవి. రష్యాకు సులభంగా విమానాలను, టాంకులను సప్లయి చెయ్యడానికి పరిషియాలోను ఇరాకులోను బ్రిటిషువారు పెద్ద ఫ్యాక్టరీలను నిర్మించుచున్నారు. అమెరికానుంచి వచ్చిన ఒక పెద్ద వ్యాపారపు కంపెనీకి ఆ ఫ్యాక్టరీల నిర్మాణపు పనిని కంట్రాక్టుగా ఒప్పగించారు. పని పూర్తియైనది. విమానములయొక్క వేర్వేరు భాగాలు, అక్కడికి అమెరికానుండి వస్తూ ఉంటాయి. ఆ ఫ్యాక్టరీలలో ఆ విమాన భాగాలను కలిపి బిగించి విమానాలను సిద్ధపరుస్తూ ఉంటారు అక్కడ పరిషియాలోనే అవి సిద్ధమవుతూ ఉంటాయి గనుక, పరిషియా సరిహద్దులను దాటించి వాటిని రష్యాలోకి చేరుస్తారు. ఇదేవిధంగా టాంకులను కూడా రష్యాలోకి పంపించుచుండగలరు.

ఈ విధంగా రష్యాలోనే హిట్లరును యీ వసంత ఋతువులో చావగొట్టవలెనని, బ్రహ్మాండమైన ప్రయత్నాలు రష్యాయున్ను, రష్యాకుతోడు నీడగా అమెరికాయున్ను ఇంగ్లాండున్ను చేస్తున్నవి. ఈ వసంత ఋతువులోనే తన పెళ్లి చేస్తారని హిట్లరు గ్రహించకుండా, తన ప్రతాపం యావత్తూ యీ వైశాఖ మాసంలో చూపిస్తానని ప్రతిజ్ఞలు పలుకుతున్నాడు. ఈ వసంత ఋతువులోనేకాదు, ఇంకా ఎన్ని వసంత ఋతువులు వచ్చినా, జపానును ధ్వంసం చెయ్యకుండా విడిచిపెట్టను అని రూజువెల్టు కంకణంకట్టి కంట్రాక్టు బేరం ఒప్పుకొనియున్నాడు. జపానుకు భరతం పట్టించవలెనని నిరతం చెప్పుతున్న రూజువెల్టు తన విమాన సంతతిని సంతతము సమకూర్చుతూ వసంతమున కెదురు చూస్తూ తయారుగాఉన్నాడు. అమెరికాలోని ఫ్యాక్టరీలన్నీ సంతోషంతో ఆయన మాట శిరసావహించి పని చేస్తున్నాయి.

### వసంతఋతువు
### విజయలక్ష్మికి ముహూర్తం.

ఈ వసంత ఋతువులోనే హిట్లరు తన సమర ముహూర్తం పెట్టుకొని ఉన్నాడు. నిండుముస్తాబుతో పెళ్లికూడుకు లాగున తరలి వస్తానని అంటున్నాడు—“ అయ్యా! తప్పకుండా దయచెయ్యండి! వయస్సు ముదిరినా హిట్లరు బ్రహ్మచారిగారికి పెళ్లి చేయడానికే సిద్ధంగానే ఉన్నాము. ఈవసంతంలోనే మీ జర్మను సేనలను రక్తప్రవాహాలలో వసంతము లాడించి పంపిస్తాము ” అని బ్రిటిషువారు, అమెరికావారు, రష్యావారు కలిసి, ఎదురుకోలు సన్నాహములు చేస్తున్నారు. ఇక ఏ అభ్యంతరమూ లేదు. నవమన్మథాకారుడైన ఆ హిట్లరు బయలుదేరి రావడమే జరగవలసినపని. అయినా, యాభై ఏళ్లుదాటిన యీ హిట్లరు బ్రహ్మచారికి ఇంకా వసంతమేమిటి? అవ్వను పట్టుకొని వసంతము లాడినట్టుగా యాభై ఏళ్లు దాటిన వాడికీవసంత ఋతువులో సుముహూర్తాలు ఉన్నాయనే ఆశ ఎందుకు? అప్పుడు తాను విజయలక్ష్మిని చేబట్టగలననే ఆశతో చంకలు కొట్టుకుంటున్నాడు. విజయలక్ష్మిని ఇతనికి కన్యాదానంచేసే వాళ్లెవరు? రాక్షస వివాహంగా ఎత్తుకొని పోవలెననే ఆలోచనతో ఉన్నాడేమో! విజయలక్ష్మి అనే అమ్మాయి అట్లా వచ్చేదికాదు. రాక్షసంగావచ్చి బలాత్కారంచేసిన వాణ్ణి అమ్మవారికి బలియిస్తానంటుంది. అట్లాంటి వానిమీద ఆదిశక్తిలాగున విరుచుకొని పడుతుంది. అందుకనే పెద్దలు “ యథోధర్మస్తతో జయః ” అన్నారు. ఎక్కడ ధర్మమున్నదో అక్కడే జయము అన్నారు. కాబట్టి ధర్మపక్షం ఎవరిదో వారినే విజయలక్ష్మి వరించి పాణిగ్రహణానికి ఒప్పుకుంటుంది. చిన్న చిన్న రాజ్యాలమీదకు అక్రమంగా దండెత్తిన లోకకంటకుడైన హిట్లరు చేసిన పని ధర్మమే అని ఎవడైనా అనగలడా? యమలోకంలోకూడా లేనిఘోరహింసల పాలు జేసి తన ప్రజలను మాడ్చి వేస్తున్నాడు జర్మనీలో. తాను ఇతర దేశాలకు ప్రమాణపూర్తిగా భగవంతుని సాక్షిగా వ్రాసియిచ్చిన ఒడంబడికలను ప్రమాణపత్రాలను రద్దుచేసినాడా లేదా? రష్యాతో స్నేహంగా ఉన్నట్లు ప్రవర్తించి నమ్మించి ద్రోహంచేసి, హఠాత్తుగా రష్యామీదకు దండెత్తినాడా లేదా? ఇటువంటి ద్రోహిని, లోకకంటకుని పక్షము ధర్మపక్షమని ఎవడైనా అనగలడా? ఇతడు చేసేది ధర్మయుద్ధమేనా? ప్రపంచములోని అన్ని రాజ్యాలవారికీ ఎవరి ప్రజాస్వాతంత్ర్యము వారికి తిరిగి లభించగల్గుటకొరకై పోరాడుచున్నామని రూజువెల్టు, చర్చిల్లుగార్లు కలిసి లోకానికి వెల్లడించారు. ఇంతకంటే ఉత్తమ సంకల్పం ఇంకొకటి ఉండదు. ధర్మయుద్ధము అంటే ఏమిటి? ప్రజాస్వాతంత్ర్య ధర్మప్రతిష్ఠాపనకోసం యుద్ధం చెయ్యడమే ధర్మయుద్ధం. మిత్రమండలి చేబట్టినది ధర్మం. మిత్రమండలిని చేబట్టగలది విజయలక్ష్మి ఇది శాశ్వతమైన ధర్మసూత్రము. ఇది సర్వలోక సనాతన మంగళసూత్రము. వసంత ఋతువులో చెట్లు చేమలు చిగిరించినట్లుగానే అందరి కోరికలూ చిగురించగలవు. అటువంటి సందర్భంలో హిట్లరుకు మాత్రంకోరిక లీరికలెత్తకుండా ఉంటాయా? అందుకనే, వసంతం వస్తోంది అని ఎంతో సంబరంగా ఉంటున్నాడు. హిట్లరుకు సమరంఅంటే సంబరం ఎక్కువ. “ అహా! ఎంతో ముదమాయెగా! యీ వసంత మెంతో ముదమాయెగా! ” అని సంతోషంగా పాటపాడుతూ తన నాజీసేనలను వెంటబెట్టుకొని, రష్యాలోకి చైత్రయాత్ర చైత్రమాసంలో సాగించవలెనను కుంటున్నాడు. కాని ఈసారి హిట్లరు సాగించబోయే చైత్రయాత్ర విజయయాత్ర మాత్రంకాదు. అది నాజీసేనలకు చిత్రవధయాత్రగా ఉంటుంది. హిట్లరుకు యీసారి రష్యాలో జరుగబోయే పరాభవం చేదుమాత్రగా ఉంటుంది. ఈసారి జరుగబోయేసమరంలో జర్మను సేనలను రక్త ప్రవాహాలలో ముంచి ఓలలాడించి జయించడానికి అటురష్యా, ఇటు అమెరికా ఇంగ్లాండులు సర్వసిద్ధంగా ఉన్నాయి. ఈరక్త వసంతంకోసం, యీసమర వసంతంకోసం హిట్లరు తన సేనలను వెంటబెట్టుకొని వస్తానన్నాడు. ఈ వసంత సమరంతో యీ సమరవసంతంతో, హిట్లరుకు అంతం తప్పదు. అంతటితో హిట్లరు జాతకం ఆశ్వాసాంతం సర్వం సమాప్తం కాగలదు. ఈ చలికాలంలో యీ మంచుకాలంలో రష్యాలో తిన్న దెబ్బ హిట్లరుకు చాలలేదు. హేమంతం చాలలేదు గనుక ఇంకా వసంతంలో జయించగలననే సిద్ధాంతంలో ఉన్నాడు. హిట్లరు అంతం సిద్ధం గనుకనే ఆసిద్ధాంతంలో ఉన్నాడు. కనుక రానివ్వండి వసంతం! హిట్లరు వసంతా తెలుస్తుంది. యుద్ధం ఆశ్వాసాంతం అవుతుంది. వసంతం వెళ్లగానే లోకం ప్రశాంతం అవుతుంది.

---

# విదేశములందలి భారతీయ సేనల చర్య

## స్టేటు కౌన్సిలుసభలో భారతసేనాధిపతి ప్రశంస.

### ప్రస్తుత విషమస్థితి గడచిపోతుంది. కార్మికులు ఎక్కువ కృషి చేయాలి.

ఇండియా స్టేటు కౌన్సిలు భారత సేనాధిపతి సర్ ఆలను హార్ట్లిగారు భారతీయ సేనలు విదేశ యుద్ధరంగములందు చేయుచున్న ఘనకార్యముల గూర్చి ప్రకటించిరి. గత నవంబరులో జనరలు అచిను లేకుగారు ఆఫ్రికాలో సిరనైకా సరిహద్దులందు గుమిగూడియుండిన జర్మను, ఇటలీ సైనిక దళములను యెదిరించి మెరుపుయుద్ధము సాగించిరని తెలిపిరి. మరి మూడు వారములందే జపాను రాజీరాయభారములు జరుపుచునే పశిఫికు సముద్రములందు యుద్ధం ప్రారంభించింది. అటు పడమర సిరినైకా ప్రాంతములును, తూర్పున సింగపూరు ప్రాంతములును ఇండియాకు రక్షణ శిబిరములనియు వాటిని రక్షించుకొన్నచో ఇండియాకు యుద్ధం రాకుండ వారింపవచ్చుననియు చెప్పబడుచుండెను. అందుకనే యీరెండు యుద్ధరంగములందు బ్రిటిషు సేనలకు మన భారత సేనలు తోడుగ పంపబడినవి. పడమరను మన సేనలు సిడిబరాని, తూర్పు ఆఫ్రికా, సిరియా, ఇరాకు, ఇరాను దేశములందు విజయపరంపరలు బడసినవి. కాని తూర్పున అదివరకెంతకాలంనుండో తయారగుచుండిన మహానౌకాదళ సైనిక శక్తులకు గురియైనవి. ఉత్తర ఆఫ్రికాయందు నాల్గవ భారతీయ డివిజను సైనికుల చర్యలెంత ప్రశంసార్హములో మలయా ద్వీపకల్పమునందలి భారతీయ సేనలు అధిక సంఖ్య

శత్రువర్గములతో అడుగడుగున యుద్ధం చేయుచు వెనుకకు తగ్గుచు చూపిన త్యాగము వీరత్వముగూడ అంత ప్రశంసార్హములే.

### నాల్గవ భారతీయ డివిజను.

ఉత్తరాఫ్రికాయందు సిరినైకా రాష్ట్రంలో శత్రు స్థానములను భేదించుటకు నాల్గు చోట్లను నాల్గవ భారత డివిజన్ సేన ఘనమగు యుద్ధములు సల్పి విజయం పొందెను. అవేవన : (1) సిడి ఓమారు, (2) లిబియను ఓమారు, (3) బీరుఎల్ గుబి, (4) గజాలా. ఈజిప్టు సరిహద్దువద్ద కాపలా యున్న యీనాల్గవ భారతీయ డివిజను గత జూన్ మాసంనుండి నవంబరు వరకు శత్రువు కనబడ్డపు డెల్ల యెదిరించుచు నవంబరులో శత్రుస్థానములపై దాడి ప్రారంభించి, ఒకదాని తరువాత నొకటి పైన చెలిపిన స్థానములను ఆక్రమించి శత్రు సేనలను వెనుకకునెట్టెను. ఇంతలో 5 వ భారతీయడివిజను సైన్యము ఈజిప్టువిశాల దక్షిణమున శివయను ఊరునుండి దాడివచ్చి, సిరనైకాలోనున్న జాలో యను ఎడారిసరస్సునుండి ఇటలీ సైనికదళమును బంధించి వశపరచుకొనెను

అప్పటికి జర్మను సేనాని రోమెల్ జడబియాకు దక్షిణమునకు పారిపోయెను. అప్పటికే అనేక వందలమైళ్లు ఆక్రమించినందున యింకను ముందు నకుపోయి అతన్ని వెంటపెట్టుటకు అవినులేకు గారికి వీలుకాలేదు జనవరిలో అనుకోకుండా వానలు తుఫానువచ్చుటచే సిరనైకాలో దారులు బురదై, విమానాశ్రయములుచెడి మన సేనలకు కష్టం కలిగెను. అప్పటికి చితికియున్న తన సేనలను కూడతీసుకొని, అతికష్టమై మధ్యధరా సముద్రం దాటి వచ్చిన క్రొత్త సేనల సహాయంతో రోమెలుసేనాని తిరుగుదాడి మన 8 వ సైన్యం ముందుభాగంపై ప్రారంభించెను. ఈ తిరుగు దాడి జనవరిలోనే ప్రారంభింప బడినందున, అప్పటికే అలసియుండి బెంగాజీలో కొంత విశ్రాంతికి ఎదురు చూచుచుండిన 4 వ డివిజను తిరిగి తీవ్ర యుద్ధమున పాల్గొన వలసివచ్చెను. బెంగాజీకి దక్షిణమునసుండిన 7 వ భారతీయ శాల్బలము అనగరింకివచ్చి 4 వ డివిజనుకి సహాయం చేయకుండా జర్మను టాంకుదళం అడ్డగించెను. బెంగాజీకి ఉత్తరంగానున్న రోడ్డును వారు తెగగొట్టిరి రెండురోజులెట్టి వార్తలులేవు. ఏదో పుట్టిమునిగిం దనుకున్నాము. కాని తరువాత 7 వ సైనికదళం టొబ్రుకునకు పడమరను మన సేనలను కలుసుకోగలిగెను. వారు ఎట్లో అద్భుతంగా శత్రువుల ముట్టడినుంచి తప్పించుకొనిరి. కొద్ది వాహనములు, సామానులు పోయినవిగాని, సైనికులు చాలమంది తప్పించుకొనివచ్చిరి. ఇది ఒక అద్భుతమయిన కథ.

### హాంగుకాంగు, మలయా.

తూర్పున మన సేనలకథ అంత బాగాలేదు. ఇచట మన భారతీయసేనలు అనేకతావులందు వెనుకకు మరలవలసివచ్చెను. చాలకష్టం కలిగింది. బ్రిటిషు కనడా సేనలతోకలసి భారతీయసేన ఎక్కువ త్యాగంచేసింది. మొట్టమొదట హాంగుకాంగులో కొద్దిరోజులు తీవ్రవిరోధం జరిగిన పిమ్మట, అచట 5 వ బెటాలియను, 14 వ పంజాబు రెజిమెంటు, హాంకాంగు-సింగపూరు రాయలు ఆర్టిలరీ, వైద్యాదళము లొంగిపోవలసి వచ్చెను.

మలయాలోగూడ జపాను సేనలు నాలుగు డివిజనులు అకస్మాత్తుగ వచ్చిపడుటచేతను వారికి సేనాబలము, విమానబలము అధికంగా నుండుటచేతను, వారిని చిరకాలం ఎదిరించుట మన సేనలకు కష్టమైనదనియు, యీ ప్రాంతమున భారతీయ సేనలు ఎట్టి పనులు చేయగల్గెనో వివరములు తెలియవనియు, సింగపూరు పడిపోవుట గొప్ప వోటమేగాని ప్రమాదకరమయినది కాదనియు, భారత సేనాధిపతి తెలిపెను.

భారతీయ సేనలు తమ సేనను విడచి శత్రువుకి లొంగిపోయినవని శత్రువులే చిత్రమగు కథలు కల్పించి ప్రచారం చేయుచున్నారు. అది అబద్ధము అననుకూల క్లిష్టపరిస్థితులందుండి, వెనుక నుండి శత్రువువచ్చి చుట్టవేసి గత్యంతరం లేకున్నను, వారికి లొంగిపోవని నాకరించి, భారతీయ సైనికులు అడవి మార్గములబట్టి తప్పించుకవచ్చిరి.

### బర్మాలో.

బర్మాలోకూడ భారతీయ సేనలు తీవ్రమగు దాడిని ఎదుర్కొనుచున్నారు, కాని నెమ్మదిగ వెనుకకు తరుమబడుచున్నారు. అయినా వారి తీవ్రవిరోధం శత్రు దాడిని మందగింపజేయు చున్నందున, క్రొత్త సేన సహాయంగావచ్చుటకు వ్యవధి కలిగెను. చీనా సేనలు బర్మాకువచ్చి ఒక ప్రాంతమున అధిపత్యంవహించి, బర్మా రోడును రక్షించుకొనుచున్నవని సర్. అలనుగారు దెలిపిరి.

### దిగులుచెంద పనిలేదు.

"ప్రస్తుత పరిస్థితులిట్లున్నను దిగులు చెంద నవసరంలేదు. విశేషనష్టం కలిగింది, పరిస్థితులు విషమించినవి. కాని ఇదివరకు యుద్ధాలలోను యీ యుద్ధంలోకూడ యింకొకప్పుడు యింత కన్న ఎక్కువ కష్టాలు దాటేశాం. తిరిగి జయం చేకూరేలోపల యింకా ఎక్కువ నష్టాలు కూడా యుండును. ఇండియాపైగూడ విమాన దాడి, సముద్రంవైపునుండి శత్రు దాడి రావచ్చును. బహుశః శత్రు సేనలు దిగినా దిగవచ్చును."

"ఇటువంటి ప్రమాదాలన్ని ధీరత్వంతో ఎదుర్కోవాలి. ధైర్యస్థులకు, ప్రమాదం క్రొత్త యత్నాలకు ఉత్సాహం కలిగించును. క్రొత్త పరిస్థితులను ఎదుర్కొనుటకు సైనిక యత్నములన్ని సిద్ధంగానున్నవి. కాని నష్టములు పూడ్చుకొనుటకు తగిన సాధనముండవలెను. అందుకు కర్మాగారములందు, మిల్లులందు పని చేయుచున్నవారందరు, యిదివరకెన్నడు పనిచేయనంత ఎక్కువగ పనిచేయవలెను. మన నగరాలకు, మన పొలాలకు యుద్ధం చేరకుండా కాపాడుటకు ఆయుధ సామగ్రిని యిచ్చే బాధ్యత భారతీయ కార్మికుల పైని పరిపూర్ణమైని గలదు" అని భారత సేనాధిపతి తెలిపెను.

## జపాను నౌకలు 116 మునిగినవి.

పసిఫికు సముద్ర ప్రాంతములందు యుద్ధం ప్రారంభించినప్పటికి ఫిబ్రవరి 20 వ తేది నాటికి జపాను నౌకలు 109 మునిగినట్లు నిశ్చయంగా తెలిసెను. అందులో యుద్ధనౌకలు, సేనల రవానా నౌకలు, సామాను నౌకలుగూడ గలవు. ఇవిగాక 26 మునిగియుండును. 45 దెబ్బ తిన్నవి. వీటిలో సుమాత్రా దీవి చేరువ యుంచబడినవి లెక్కించ బడలేదు.

ఇవిగాక బాలీదీవి చేరువను గత ఆదివారం జరిగిన మహానౌకా సంగ్రామంలో నాల్గు జపాను యుద్ధనౌకలు ముంచబడినట్లు రూఢిగ తెలిసినది. మరి 14 లేక 15 ఎందుకు పనికిరాకుండ చెడగొట్టబడినవి.

గురువారం జావావద్ద యుద్ధంలో మరి 3 జపాను నౌకలు ముంచబడినవి.

ఫిబ్రవరి 14 వ తేదీ సరికి మునిగిపోయిన జపాను నౌకలు యీ దిగువరీతిగ నుండెనని అధికార రీత్యా తెలిసెను. విమానాలు మోసేనౌక 1, క్రూయిజర్లు 7, డిస్ట్రాయర్లు 13, సబుమెరైన్లు 6, సేనరవానా నౌకలు 52, సామాను నౌకలు 23, టాంకర్లు 7. బహుశః మునిగియున్న వాటిలో 2 యుద్ధనౌకలు, 2 విమానాలు మోసేవి, 4 క్రూయిజర్లు ఉండును.

---

## దక్షిణ ఇండియానుండి యుద్ధ సామగ్రి.

**రూ. 10 కోట్లు పైగా కొనుట.**

యుద్ధం ప్రారంభమయినాక ఇండియాప్రభుత్వం సప్లై డిపార్టుమెంటువారు మొదటి 18 నెలలలో సగటున నెలకు 26 లక్షలు విలువగల సరకు దక్షిణ ఇండియానుండి కొనుచుండిరి. తరువాత నాసంఖ్య మూడింతలుగ పెరిగింది. ఇప్పటికి దక్షిణ ఇండియాలో కొన్న యుద్ధసామగ్రి మొత్తం విలువ రూ. 10 కోట్లను మించియుండును.

అని దక్షిణ ఇండియా సర్కిలు సప్లైను కంట్రోలరగు ఎం. ఎ. శ్రీనివాసనుగారు మదరాసులో యుద్ధసామగ్రి సాంపిల్సు మందిరం ప్రారంభోత్సవం జరుగుచున్నపుడు తెలిపిరి. గవర్నరుగారు దీని ప్రారంభోత్సవం జరిపిరి. దక్షిణ దేశంలో ఏయే సరకులు యుద్ధానికి పనికివచ్చేవి తయారగుచున్నవో అన్నింటి మాదిరీలు యీ ప్రదర్శన శాలయందు చూపబడును. ఇది మదరాసు లా కాలేజీ ప్రక్కన యునైటెడు ఇండియా భీమా భవనములందు గలదు.

---

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు వార్ పబ్లిసిటి డైరెక్టరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.